గీ॥ ప్రొద్దుపొడుపు మొదల్ ప్రొద్దు ♦ గ్రుంకువఱకుఁ
జిన్నికృష్ణరాధలకట్టె ♦ చెలిమికల్గి
యొకరినొక్కరు విడనాడి ♦ యుండలేక
తనివి వింతసుద్దులు చెప్పు ♦ కొనుచునుండ్రు. ౯౩

గీ॥ ఊరములనుదూరి ♦ యేటితీరముఁ జేరి
చెట్టునీడ నిక్కి ♦ గట్టులెక్కి
ప్రణయమగ్నులగుచు ♦ రాధికాశ్రీకృష్ణు
లాడుకొందురెవరు ♦ చూడకుండ. ౯౪

గీ॥ మువ్వకోడెల మెడనూలి ♦ మువ్వలులియ
మురువునడచేత మొలనూలి ♦ మువ్వలులియఁ
దమ్మితూఁడుచే నదలించి ♦ తఱుముకొనుచు
వచ్చు రాధ శ్రీకృష్ణుని ♦ పజ్జకెపుడు. ౯౫

ఉ॥ వెన్నెలకారునం జెలఁగి ♦ వెన్నెల నవ్వన వెన్నుఁ డొక్కచో
వెన్నెలరేల రాధఁగొని ♦ వెన్నెలకుప్పల నాడియాడి యా
వెన్నెలపుల్గులో యనఁగ ♦ పీడక జోడునుగూడిమాడుచున్
వెన్నలదొంగ రాధయును ♦ బృందఁ జరింతురు బద్ధరాగులై. ౯౬

సీ॥ ఇఱుకు గుబ్బలమధ్య ♦ యిఱికి పిసాళించు
పుంజాలదండ చ ♦ న్మొనలఁజిక్క
పుంజాలదండలోఁ ♦ బువ్వాటలాడెడి
పులిగోరు పతకంబు ♦ గులకరింప
తొడవుగా నిడినట్టి ♦ మెడనిండ మెలివడ్డ
గురివెంద పేరులు ♦ గునియుచుండ
పచ్చరాల్ దాపిన ♦ యచ్చుగుండుల సరుల్
మిట్టుగుబ్బలమీఁద ♦ మిడిసిపడఁగ

గీ॥ నడ్డబాసయు ముంగెఱ ♦ నటమటింపఁ
గాలియందెలు గల్లురు ♦ గల్లురనఁగఁ
జొక్కపుంథీవి రాధిక ♦ చొక్కుచుండుఁ
దనదు సోయగంబునుజూచి ♦ కొనుచుఁ దనిసి. ౯౭

చం॥ తుఱుము విదల్చుచున్నపుడు ♦ తొంగలితుమ్మెదఱెక్క వెండ్రుకల్
పిఱుఁదులమీఁద జారిపడి ♦ పెళ్కుఁటి మిట్టిపడంగ ముంగురుల్
మురువుమొగంబుమీఁదఁ బడ ♦ ముద్దులమూటనుగట్టు రాధికా
తరుణి హరించుఁజూపరుల ♦ ధైర్యము పుత్తడి బొమ్మలాగునన్. ౯౮

గీ॥ ప్రొద్దుపొడువక మునుముందె ♦ పొరలిలేచి
దూవుముడిలోన విరిపూలు ♦ తుఱిమి, తుఱిమి
చెలఁగి చిన్నికోలను రాధ ♦ చేతఁబట్టి
తోలుకొనిపోవు నామంద ♦ దొడ్డినుండి. ౯౯

సీ॥ జాఱుపయ్యఁటనట్టె ♦ సవరించు నెపముచే
వలుఁదపాలిండ్లఁగ ♦ న్పఱచుచుండు
కందోయి మూసికో ♦ కలదు చిత్రంబంచుఁ
బూదుమారంబులో ♦ ముంచిమెత్తు
గుమ్మపాలను దెచ్చి ♦ కోకొమ్మ నాసామి
యనిపాలదుత్తను ♦ నందియిచ్చు
కనుగొమ్మ నే నెవ ♦ ర్తనొయంచుఁ గనుమూయు
వెనుకగా బొమ్మల్లు ♦ వెన్నునాన్చి

గీ॥ తెలిసియో తెలిసికొనకో ♦ కలికిమిన్న
దొంగకృష్ణుని ప్రేమంబు ♦ దొంగిలింప
జగములన్నియు దిగ్భ్రమింగఁ ♦ జాలుజాణ
కందచందములెన్నియో ♦ యట్టెచూపు. ౧౦౦

గీ॥ మిట్టుగబ్బిగుబ్బల మొనల్ ♦ మీఁటి చింపు
ననుచుఁ జనుకట్టును దొడిగి ♦ కొనుటమాని

పైఁట చెఱఁగునఁ బొమ్మల ♦ పట్టుఁ గప్పఁ
బుట్టియెఱుఁగఁ బోమిటువంటి ♦ పొదుపులాఁడి. ౧౦౧

ఉ॥ రాగములేనిరాధ యట ♦ రాగము క్రొన్నన సాగుచుండఁగా
రాఁగ ముదంబు కృష్ణుని స ♦ రాగములాడెడి కోర్కెపుట్టఁగా
రాగముఁదీయుచుర్వి సుమప ♦ రాగముపై విదలింపఁ బట్టుకో
రాఁగ మురారి, యందకయె ♦ ఱాఁగతనంబున దాటుజాణయై. ౧౦౨

ఉ॥ వెన్నుఁడు రెండుచేతులను ♦ బిల్లనఁ గ్రోవిని గావిమోవిపైఁ
బన్నఁగఁ బెట్టి మైమఱచి ♦ పాడుచునుండఁగఁ బూవుబుత్తులన్
గొన్నిటిఁ దెచ్చి వంశమున ♦ కుంగయిసేయుచు రాధమాయమై
మన్ననమాలి పూఁబొదల ♦ మాటున డాఁగిలిమూఁతలాడెడిన్. ౧౦౩

సీ॥ కొండగోఁగులపూలు ♦ కొండె సిగంజుట్టి
కొండాడుచుండు మా ♦ కొండఁడంచు
నెమ్మికుంచియఁ దెచ్చి ♦ నెత్తిపైఁ గుదిరించి
కుదిలించి యూఁగించి ♦ కులుకులాడు
బుజ్జిటకొమ్మలో ♦ బుక్కాము విరఁజిమ్మి
"యేర! మాధవ!" యంచు ♦ నెత్తిపొడుచు
బొండుమల్లెలదండ ♦ దండ చేతికిఁ గట్టి
దండంబు నిడుచుండు ♦ దండనిల్చి

గీ॥ పూనిగొల్లెతవాతెఱ ♦ పానకంబొ!
పూవుఁదేనియయో! యిచ్చుఁ ♦ బుక్కిలింత
కలవిగాకుండ, నాపోవు ♦ నామతించి
జాజిపూవుల పొదరింటి ♦ చవికెయందు. ౧౦౪

సీ॥ కేతకీకుంజంబు ♦ క్రేవల కేగితే?
చెక్కిళ్ళపై నుండెఁ ♦ జిన్నిగీట్లు
వకుళావనీజంబు ♦ వద్దకుఁ బోయితే?
మొగమెల్లఁ బుప్పొడి ♦ పులుముకొనియె

క్రొమ్మావిగున్నల • క్రొన్ననల్ కోసితే?
ఎంతో నీమునిగ్రవేళు • లెఱ్ఱవడియె
ముండ్లలీ వెలుగల్లు • పొదరిండ్లు దూరితే?
చెదరి నీకీల్గంటు • చిక్కువడియె

గీ॥ నొక్కచోటను నీవు కూ • ర్చుండ లేవె?
కాలుకుదుర దే నీకెందు? • బాలయంచు
చిట్టిగ్రవేలితో మెల్లగాఁ • జెంపమీటి
ముద్దుకృష్ణుండు రాధను • బుజ్జగించు. ౧౦౫

సీ॥ కర్ణికారముఁ దెచ్చి • కర్ణయుగ్మంబున
సొగసుగాఁ గీలించి • సొక్కుచుండు
మెట్ట దామరదండ • మెడనిండ దిగవైచి
ముసిముసి నవ్వులో • మునుఁగుచుండు
కలువపూవుల పేరు • కలకంఠి సిగచుట్టు
జాఱకుండఁగఁ జుట్టి • సంతసించు
పొగడొందు క్రొందావి • పొగడపూవుల సరుల్
మణిబంధమునఁ జుట్టి • గొణుగుచుండు

గీ॥ మోముదమ్మిపైఁ బుప్పొడి • బొట్టుపెట్టి
యూఁగు నెమలియీఁకలఁ జూచి • యురలినవ్వ
ముద్దుకృష్ణుని రాధిక • ముద్దులిడుచు
మెలఁగు బృందావనీవీథి • మేనుమఱచి. ౧౦౬

సీ॥ రోమాంచలముచేత • రోమంథములుమాని
నిలువుగ్రుడ్డున నాలు • నిలిచియుండ
కాళిందిబేడిస • మీలెల్ల నేదురెక్క
వేలంబునకుఁ జేరి • వినుచునుండ
గండ్రమాకుల డిగ్గి • కాలాహితండంబు
నిలువునఁ బడగెత్తి • నిలిచియుండ

వ్రేపల్లెలోనున్న ♦ వ్రేతలు గుడికట్టి
పనిపాటలనుడించి ♦ వచ్చుచుండ

గీ॥ చాల విరిపూలు జలజల ♦ రాలుపొగడ
నీడలోనఁ ద్రిభంగిగా ♦ నిలిచియుండి
మురళి చేఁగొని విశ్వస ♦ మ్మోహనముగఁ
బాట పాడును దనరాధ ♦ ప్రక్కనున్న. ౧౦౭

ఉ॥ ప్రొద్దున మేలుకాంచి నవ ♦ మోహినిరాధఁ దలంచికొంచు వే
చద్దిని వెన్నతో మెదిపి ♦ సాపడిమెల్లననూదు గ్రోవినిన్
దద్దయుఁబట్టికొంచుఁ దన ♦ దారిని మందకుఁబోవు నెప్పుడున్
ముద్దియయైనరాధ నెటి♦ ముద్దుమొగంబునుజూచుకోర్కెమై. ౧౦౮

కం॥ వాగర్థమ్ముల వలె నను
రాగాతిశయమ్ము చేత ♦ రాధాకృష్ణుల్
భోగాభోగముల మఱచి
యోగీశ్వరులట్టులుందు ♦ రొకటై యెపుడున్. ౧౦౯

గీ॥ ఇంటికడ మందకడరాధ ♦ కృష్ణమూర్తి
కన్నుదోయికి నిండారఁ ♦ గానుపించుఁ
గృష్ణునకు రాధమయమయ్యె ♦ నీజగంబు
పగలు రేలను భేదంబు ♦ పాసిపోవ. ౧౧౦

గీ॥ బృందయంత గోగోపికా ♦ బృందమెల్లఁ
గృష్ణమయమై కనుంబడు ♦ నెల్లయపుడు
రాధికాచకోరాక్షి నే ♦ త్రయుగమునకు
నొందుగనరాదు శ్రీకృష్ణుఁ ♦ డొకఁడుదక్క. ౧౧౧

కం॥ ఓరంత ప్రొద్దొకండే
యూరంతయుఁ దిరిగితిరిగి ♦ యబలాటముతో

గోరంతభయములేకయె
కేరింతలనింటికరుగుఁ ♦ గిలకిలనగుచున్. ౧౧౨

సీ॥ ముక్కుగోళ్లుబికించి ♦ మోరెత్తుముడిగిబ్బ
నఱచేతిదెబ్బతో ♦ నదిమిపట్టు
కాల్ద్రివ్విపోరాడు ♦ కారుగిత్తలనొత్తి
యొక్కెడేపోరాట ♦ ముడుపుచుండు
అంకెవేసెడికోడె ♦ యంకెవేసిన ముట్టె
తెగియించిచెవిఁబట్టి ♦ తెచ్చునొకెడ
కాళ్లబందెముదూసి ♦ క్రేళ్లువారెడినబ్బి
బదరించియొక్కెడే ♦ పట్టితెచ్చు

గీ॥ ఒరులుసేయంగనేరని ♦ బిరుసుపనుల
నెన్నియెన్నియోచేయుచు ♦ నెన్నరాని
మిత్రకోటినిగడియించి ♦ మెలఁగు నవవ
రతము, కృష్ణుండుయావనా ♦ రంభవేళ. ౧౧౩

సీ॥ జగజెట్టిచనుదేరఁ ♦ జలపట్టి పోరాడి
తనచల్లడముక్రింద ♦ ననుపుచుండు
బుసకొట్టునెలత్రాచుఁ ♦ బుట్టకల్గుననుండి
వెసబైటకునులాగి ♦ విసరికొట్టు
అలవ్రూకకారుదు ♦ న్నల కొమ్ములనుబట్టి
నిమిషంబులోవాని ♦ నిల్వరించు
ఎత్తైననెత్తమ్ము ♦ లెగఁబ్రాఁకిగండభే
రుండకులాయముల్ ♦ రోయుచుండు

గీ॥ ఆకతాయిపనులనిట్టు ♦ లాచరించు
గోపబాలురతోఁగవ ♦ గూడిబృంద
నిండుమురితోడఁజరియించు ♦ చుండునవవ
రతము కృష్ణుండు యావనా ♦ రంభవేళ. ౧౧౪

మందా॥ వాసింపఁ శారదరజనులఁ ♦ బాండురజ్యోత్స్నచే నను
ల్లాసంబొప్పఁ బ్రజలరుణులె ♦ ల్లఁ బిసాళింపరారా
జై సంతోసిల్లి మురహరుఁడుఁ ♦ యౌవనారంభవేళఁ
రాసక్రీడా చతురుఁడగుచుఁ ♦ రాజిలుఁ బృందలోనఁ. ౧౧౪

సీ॥ కారానిపోరాని ♦ గహనభూములనెల్ల
ద్రిమ్మరీఁడై దిమ్మ ♦ దిరుగనేర్చె
తెలినీటయమునలో ♦ జలకమాడెడి గోపి
కల కోకలను మూటఁ ♦ గట్టనేర్చె
తనతోడనాలమం ♦ దలఁగాయు వేతలఁ
జిట్టంటుచేతలఁ ♦ ముట్టనేర్చె
కొండాటముంగోరి ♦ కొంపకొంపలుదూరి
మిసిమివెన్నలముద్ద ♦ మెసవనేర్చె

గీ. కొంటెతనమేలరాకుండు ♦ గొప్పయింటి
బిడ్డకును జెల్లుబడి యుండ ♦ నడ్డమేమి?
అవునుగాదనువారెవ ♦ రైన నుండు
వారె నిజముగా నొకగొల్ల ♦ పల్లెయఁదు. ౧౧౫

వ॥ క్రమముగా శ్రీకృష్ణుండు పెఱిగి పెద్దయై చెలరేఁగి. ౧౧౬

సీ॥ ఒకనాఁడు పెనుబండి ♦ నూడికూలఁగఁదన్ను
నొకనాఁడు పెన్త్రాఁచు ♦ నుక్కడంచు
ఒకనాఁడు సుడిగాలి ♦ నురలించియెగఁజిమ్ము
నొకనాఁడు కార్చిచ్చు ♦ నుమిసివైచు
ఒకనాఁడు గాడిద ♦ నోడించి పారిపుచ్చు
నొక్కనాఁ డాంబోతు ♦ నుసురుఁదీయు
ఒకనాఁడుయమునలో ♦ నుంకించి వెనదూఁకు
నొకనాఁడు రాకాసి ♦ మొకముఁ దన్ను

గీ॥ వీనిఁ గనుచున్న రాధిక ♦ బేలుపోయి
దేవునంతటివాఁడంచు ♦ భావమందు
నమ్మి ముద్దుకృష్ణుని ప్రక్క ♦ నక్కియుండి
నిరతమాతని జపియించుఁ ♦ బరవశయయి. ౧౧౭

గీ॥ మరులు జడ వేసి కైసేసి ♦ మరులుగొల్పఁ
"జెన్నకృష్ణుండు" రాధిక ♦ చీరచెఱఁగు
గట్టిగాఁబట్టికొని, పోవుఁ ♦ గాలికొద్ది
మరులు జడఁ ద్రొక్కినటువంటి ♦ మనుజుఁబోలె. ౧౧౮

చ॥ పసులను గాయఁబోయెడి నె ♦ పంబునమందకుఁబోయికృష్ణుఁడుం
బసులను గాయకుండఁ బార ♦ పాటుననైనను; రాధఁగూడుచుం
దుసికిలుచుండెనంచువిని ♦ త్రొక్కిసలాడక మేనయత్తతా
ముసిముసినవ్వునవ్వుకొని ♦ మోదమునందుచునుండు రాధయుం. ౧౧౯

ఉ॥ రాధికఁగూడిమాడి యను ♦ రాగమునం నిరతంబునుం రసాం
భోధినిమగ్నుఁడయ్యుఁదల ♦ మున్కలుగాఁ జరియింపుచుండియుం
మాధవుఁడెంతమాత్రము, ప్ర ♦ మత్తుఁడుగాక మనంబులోసదా
త్మాధవుఁడైన మాతులునిఁ ♦ గంసునిఁగూర్చితలంచెనీగతిం. ౧౨౦

ఉ॥ క్రోధపరీతమానసుఁడు ♦ క్రూరుఁడు భోజకులాభిమానసం
బాధితుఁడైన కంసజన ♦ పాలుఁడు జీవముతోడ నున్నచో
గాథలు చెప్పనేమిటికి? ♦ గల్గునె యోగము రాజభోగముం?
బాధలుతీరునే? తుదకుఁ ♦ బ్రాణముమీఁదికి రాకయుండునే. ౧౨౧

గీ॥ భోజదార్జన్యవాహిని ♦ పొంగిపొరల
నానకట్టను వేయక ♦ యాఁగియున్నఁ
బాఱిచి యాదవద్వీపంబు ♦ ముంచివైచు
నంచు నిరతంబు లోలోఁ ద ♦ లంచుచుండు. ౧౨౨

గీ॥ సార్వభౌముండనని జరా ♦ సంధవిభుఁడు
నరకు సేయుటమాని నె ♦ వ్వరినిఁగూడ
వానిఁదెగటార్పకున్న లా ♦ భంబులేదు
పురుషకారంబుమానుట ♦ పోలదిపుడు. ౧౨౩

గీ॥ హంసడిచికసాళ్వనరక ♦ కంసదంత
వక్త్రశిశుపాలపౌండ్రక ♦ వాసుదేవ
దివ్యధానుష్కముఖ్యైక ♦ లవ్యముఖర
యోధులనుగూడి వర్తించు ♦ చుండునతఁడు. ౧౨౪

ఉ॥ ఒక్కొకవంకఁబెట్టుకొని ♦ యొక్కొకవీరవరుల్ క్రమంబుగా
నొక్కొకపట్టునందు సమ ♦ రోర్వినిగూలిచి మాగధేంద్రునిన్
తెక్కులులేని పుల్గునొన ♦ రించిహరించుట యొప్పుఁగానిచో
దక్కునెరాజ్యభోగములు? ♦ దక్కునెరాచరికంపుమన్ననల్? ౧౨౫

గీ॥ కాని కథయొక్కటున్నది ♦ కదనమందు
నొంటరిగఁ బోరుసల్పుచో ♦ నోటమబ్బు
మాగధుఁడు దివ్యసేనాస ♦ మన్వితుండు
శత్రుభీకరయుద్ధవి ♦ శారదుండు. ౧౨౬

ఉ॥ నిట్టులమైననేర్పుమెయి ♦ నిత్యము మాగధవైరిపాళితోఁ
జుట్టరికంబుఁజేసి రణ ♦ శూరుల వీరులఁ బ్రోవుచేయుచున్
గుట్టుగ సైన్యసంపదను ♦ గూర్చుటమిక్కిలి రాజనీతి, యే
దెట్టులనైన సాయమగు ♦ నీపనిచేత దురంబుకల్గినన్. ౧౨౭

గీ॥ అంచుఁ గృతనిశ్చయుండయి ♦ యావులించి
యప్పుడే యుద్ధవిడిలేచి ♦ యరిగెనింటి
కొకఁడె రాధకడకుఁబోక ♦ యొక్కనాఁడు
కార్యభారంబుమనసులోఁ ♦ గలఁతపెట్ట. ౧౨౮

సీ॥ చరణాబ్జ యుగ్మలా ♦ క్షారసం బొకమాటు
పగవారి క్రొన్నెత్రు ♦ వాఁక యొకట
ముగుద వాలుంజూపు ♦ మొత్తంబు లొకమాటు
వైరుల తూపుల ♦ బారు లొకట
మదనరంగస్థలీ ♦ మండనం బొకమాటు
కదనరంగస్థలీ ♦ గరిమ యొకట
కామతంత్రపరీత ♦ కార్యంబు లొకమాటు
రాజ్యతంత్ర రహస్య ♦ రాజి యొకట

గీ॥ కలలు గనుచుండె రేలెల్లఁ ♦ గళవళించి
యన్యదుర్లభమైన కా ♦ ర్యంబుఁ జేయఁ
బూని క్రైకొన్నవాఁడొటఁ ♦ బోవ హళించి
కునుకుపట్టునే కార్యాతు ♦ రునకు నెందు? ౧౨౯

వ॥ దూరదృష్టియు, దివ్యదృష్టియుఁ గల్గి శ్రీకృష్ణుండు వెంటనే బహు
బాంధవసంపాదనంబునకై నడుముకట్టికొని బహుళ ప్రయత్నంబులఁ
జేయ సిద్ధపడి. ౧౩౦

సీ॥ భోజక్ష్మానాథు ♦ పుత్రి రుక్మిణి చెట్ట
పట్టెను రాక్షసో ♦ ద్వాహమందు
బూటకంబులు చెప్పి ♦ పోరఁ బుచ్చి సత్యభా
మను వివాహంబాడె ♦ మరులు చూపి
విందానువిందుల ♦ ప్రియసహోదరి మిత్ర
విందను మెలపుతోఁ ♦ బెండ్లియయ్యె
నగ్నజిన్నృపుని నం ♦ దన నాగ్నజిత్తిని
బరిణయం బాడెను ♦ బందెమొడ్డి

గీ॥ నరకుఁ బొరిపుచ్చి దురమందు ♦ నరులు బెగడఁ
బెండ్లి పెండ్లంచుఁ బదియారు ♦ వేల రాచ

కన్నెలకుఁ దాళిబొట్టును ♦ గట్టివైచె
మధ్యదేశంబు బాంధవ ♦ మయముగాఁగ. ౧౩౧

గీ॥ అతిభయంకరాటవులందు ♦ యమునయొద్ద
స్వైరవృత్తిని నిరతంబు ♦ సంచరించు
నాటవికకన్య కాళింది ♦ యనెడునామెఁ
బరిణయంబయ్యెఁ దనవార ♦ లెఱుఁగకుండ. ౧౩౨

గీ॥ మద్రవసుమతీనాథు కొ ♦ మార్తయైన
భద్ర గుణసముద్రను భూరి ♦ వైభవమున
మత్స్యయంత్రంబుఁ బడఁగొట్టి ♦ మహితశక్తిఁ
బెండ్లిపెద్దలు వెఱగందఁ ♦ బెండ్లియాడె. ౧౩౩

గీ॥ కొండగవులయందుఁ ♦ గ్రుమ్మరు భల్లూక
జాతి జాంబవంతుఁ ♦ జావఁగొట్టి
వానిబిడ్డ జాంబ ♦ వతిని బెండిలియాడె
నడవిజాతిపొందు ♦ నాశఁజేసి. ౧౩౪

గీ॥ యాదవాన్వయులకును భో ♦ జాంధకులకుఁ
గలుగు వైమనస్యంబెల్లఁ ♦ దొలఁగిపోయె
రుక్మిణీసత్యభామాస ♦ రోజపత్ర
నేత్రల వివాహములచేతఁ ♦ జిత్రముగను. ౧౩౫

వ॥ ఇట్లు గృహచ్ఛిద్రంబులనెల్ల నుడిపికొని బలవంతుండై మంత్రదత్త
ప్రభావంబుచే నత్యుత్సాహంబునం జెలరేఁగి, మింటికి మంటికిఁ
దాళము వేయ నెంచుచుండ, ౧౩౬

ఉ॥ మాగధుఁ డీయుదంతము స♦మస్తముఁ జారులచే గ్రహించి యీ
యాగడమేమి? యాదవున♦కా తలవంచుటమాగధుండు? భూ
భాగమునన్ జరాసుతుని♦బాహుబలంబున కడ్డగల్గునే?
సాగునె యిట్టిచిత్రములు?♦ సాగునె యీ విపరీతకర్మముల్ ౧౩౭

గీ॥ ఓడుగోరు వెచ్చని నల్ల • నోలసి ముద్ద
కట్టినట్టి కృష్ణుని యెమ్మె • క పొడి యనెడి
కుంకుమున బొట్టుపెట్టెదఁ • గొంకులేక
యలుగుసెలచేత జయలక్ష్మి • యలికమందు. ౧౩౮

గీ॥ ఎవనిఁగాఁదల పోసెనో? యీజరాత
నూజు? ఎవరిగాఁ దలపోసె • నో మగధనృ
పుని బలంబుల? అడవి మూఁ • కనుచు నాత్మఁ
దలఁచెనో యతఁడెనిజంబుఁ • దెలిసికొనును. ౧౩౯

వ॥ అంచు దండనాయకులం బిలిపించి పణవఢక్కాది ఘోషంబులచే భూనభోంతరాళంబు బీటలువార నతులచతురంగపృతనావితాన పరివృతుండై, కృష్ణునిపై దాడివెడలి నాల్గహోరాత్రంబులు హోరాహోరింబోర యాదవసైన్యంబులు, పంచబంగాళమై, వీటతాటమై, చెల్లాచెదరై పోవ, శ్రీకృష్ణుండు చేయునదిలేక యాప్తబంధుసహితంబుగా బలాయితుండయ్యె. జరాసంధుండు మగిడిమగధం బ్రవేశించెను. శ్రీకృష్ణుండు విసుగువిరామము లేక, విఱిగిపాఱిన సైన్యంబులఁగూర్చికొని, మరల యుద్ధప్రయత్నములు సేయుచుండ మాగధుండు వెండియు దండెత్తిపోయి పరాభూతునింజేయఁజేఁజిక్కక శ్రీకృష్ణుండు దుసకిల్లెను. ఈకైవడి నిరువదిమాఱు లోడించి శ్రీకృష్ణునిఁ బలాయనసూత్రపరాయణునిగాఁజేసెఁదత్కారణంబున జరాసంధుఁడు యాదవునిఁ బట్టుకొన నేరకపోయె. ఈపోరిట్టి రేఁగుచుండ ౧౪౦

కం॥ మధురాధిపుఁడగు కంసుఁడు
పృథు సైన్యంబులనుగూర్చి • కృష్ణుని నెట్లో
మథియించుట ధర్మంబని
క్రుధతోఁ దలపోయుచుండెఁ • గుసిలింతలతో. ౧౪౧

చం॥ ఇది కనిపెట్టి నేర్పుమెయి • వృష్ణికులుండిటు నిశ్చయించె నే
యదనుననైనఁ గంసవసు • ధాధిపుపైఁ బడుచుం హఠాత్తుగా

గుదియను దచ్చిరంబుఁ బడఁ ♦ గొట్టుచుఁ జుట్టలు రాకమున్నె త
త్పదవిని నాక్రమించికొనఁ♦దప్పదు తప్పినఁగార్యముం జెడుర్. ౧౪౨

గీ॥ మాగధనృపాలకుం డను ♦ మానపడిన
నతుల సైన్యంబుతోడ సా ♦ యంబువచ్చు
జగతి "నాలస్య ఋమృతమ్ వి ♦ షమ్మ" నంగ
వినమె? పెద్దలనుడి రిత్త ♦ చనునె యెందు? ౧౪౩

గీ॥ కృష్ణుఁ డీరీతిఁ దలపోసి ♦ కితవబుద్ధి
నన్నతో మధురకు నేగి ♦ యందుఁ గృష్ణు
నింటి దాసియైన త్రివక్ర ♦ యింటికేగి
ప్రేమతో నామెతో నొక్క ♦ రేయి కడపి. ౧౪౪

మ॥ ఖలసంయోగమటంచు దానెఱిఁగియున్ ♦ గార్యార్థి శ్రీకృష్ణుఁ డా
కులపాటుం గనకుండ దాసియను సం ♦ కోచంబు లేకుండఁ బు
వ్వులసెజ్జన్ గఱగించెఁ గుబ్జనుగదున్ ♦ ఫూత్కారసీత్కారముల్
గళరావంబులుధూత్కృతంబులు సెలం♦గన్ గామశాస్త్రజ్ఞుఁడై. ౧౪౫

చం॥ అనునయసూక్తులాడుచు ర ♦ హస్యములన్నియు సంగ్రహించికు
బ్జను మఱపించి మాటుపడి ♦ సాహసపద్ధతిచేత నన్నతో
జనపతి కొల్వుకూటమును ♦ జయ్యనచొచ్చి ప్రశాంతచిత్తుఁడై
సునిశితఖడ్గమట్టికొను ♦ చున్ దెగవైచె శిరంబు రెండుగన్. ౧౪౬

గీ॥ సభికులాహారవంబులు ♦ సల్పుచుండ
భటులుచెదరి నల్దిక్కులు ♦ పాఱుచుండఁ
గొలువుకూటంబు గందర ♦ గోళమయ్యె
వాసుదేవుని సింహరా ♦ వంబుచేత. ౧౪౭

చం॥ కలగుడు బొందుచున్ మధురఁ ♦ గ్రక్కున వీడుచుఁగంసభీతిచే
వలసకుఁబోయినట్టి తమ ♦ వారలఁ బిల్వఁగఁబంచికృష్ణుఁడున్

నెలవులు వారి కేర్పఱచి ♦ నీతులు సెప్పి బహూకరించి యే
యలజడియుండదంచు నభ♦యంబునొసంగి ప్రమోదచిత్తుఁడై. ౧౪౮

ఉ॥ పిమ్మట నుగ్రసేన పృథి ♦ వీపతిఁ దాతను బైడిగద్దెపై
నిమ్ముగనుంచి రాజనుచు ♦ నెల్లరకుం బ్రకటించి మంచినే
స్తమ్ముగడించి కొన్నిదివ ♦ సమ్ములపాటటనుండుచున్ స్వప
క్షమ్మును బెంపుఁజేసికొనె♦సారసనేత్రుఁడు మంత్రవేత్తయై. ౧౪౯

చం॥ పతిమృతియాలకించి యతి ♦ పాపుఁడు యాదవుఁడెంత కార్యమీ
గతినొనరించి పోయెఁగడ ♦ గండ్లు సదా మముఁ జుట్టుముట్ట భూ
పతికిదియంతయుం దెలిపి ♦ వానినిజంపఁగఁ జేతుమంచుఁ దా
మతికుపితాత్మలై చనిరి♦హాస్తియుఁ బ్రాస్తియుఁ దండ్రియొద్దకున్. ౧౫౦

గీ॥ తండ్రియగు జరాసుతుని చెం ♦ తకునుబోయి
బిట్టు కంటినీరొడికఁ ♦ గట్టుచుండ
వెక్కి వెక్కి యలందురి ♦ విభుని యాద
వుండుగూల్చిన విధమెల్ల ♦ బాగిలిచెప్ప. ౧౫౧

గీ॥ కన్నబిడ్డల దుఃఖంబుఁ ♦ గంటఁజూచి
యల్లుఁడే కాదు పరమాప్తుఁ ♦ డైనబంటు
నొకఁడు చంపెననుట చేత ♦ నుమ్మలించి
పల్కె మగధభూనేత క ♦ ట్టల్క నిట్లు. ౧౫౨

కం॥ పదిదినములు చనకుండన్
దుదముట్టించెదను గృష్ణు ♦ దోర్బలలీలన్
విదళించెదఁ గనుగొనుఁడో
సుదతీమణులార నాదు ♦ శూరత్వంబున్. ౧౫౩

గీ॥ వందలకొలఁదియున్నారు ♦ భార్యలతని
కందఱిని మిమ్ముఁ బోలెనే ♦ నగతికలను

జేసిపుచ్చెద క్షణములోఁ ♦ జింతఁదక్కి
సొడ్డుఁదీర్చెదనో కన్న ♦ బిడ్డలార! ౧౫౪

వ॥ అనుచు బుజ్జగించి తనయుల నిర్వురలోనికంపి యతి రోషావేశంబున యుద్ధసన్నాహంబుఁ గావించి దిక్కులు పిక్కటిల్ల భూమి గ్రక్కదలఁ బ్రస్థానభేరి వేయించి. ౧౫౫

సీ॥ నడగొండ లన్నట్లు ♦ లెడమీఁక నడతెంచు
గుడికొన్న పొగరేన్గు ♦ గున్నదండు
కాలిగిట్టలగాలి ♦ నేలఁబైకెగఁజిమ్మి
తేలిపేరెమువారు ♦ తేజిఫౌజు
మిఱుమిట్లు గొనునట్లు ♦ మిట్టాడఁ గొఱముట్లు
దిటవుగాఁగల మేలు ♦ తేరిబారు
వీఁకమై రిపుసేన ♦ చీకాకుఁబడఁదూఁకి
పడనూకుజోకకా ♦ల్బంటుమూఁక

గీ॥ కల్గిదుర్జయంబైన మా ♦ గధనృపాల
చంద్రచతురంగవాహినీ ♦ సముదయంబు
యాదవద్వీపమును ముంచు ♦ నట్లు బయలు
దేరె దుర్వార భండనో ♦ ద్రేకగరిమ. ౧౫౬

కం॥ వచ్చిన మాగధసైన్యముఁ
జెచ్చెర యాదవులుగాంచి ♦ సిద్ధంబగుచున్
గచ్చలు బిగియించికొనుచు
విచ్చలవిడి వచ్చిపడిరి ♦ విద్వేషులపై. ౧౫౭

కం॥ వేటున కొక్కనిఁ గూల్పఁగఁ
బోటరియగు యాదవుండు ♦ పోపో యదియున్
వేటా! యని మాగధుఁడిదె
నూటికి సెలగంచుఁ జంపె ♦ నూర్వర నొకఁడే. ౧౫౮

క౦॥ సెలవింటిదెబ్బ నెత్తుటి
సెలయేరులుపాఱ మగధ ♦ సేనాసుభటుల్
సెలరేఁగి పగరనలుగుల
సెలచే గుదిగ్రుచ్చిసెలగి ♦ సెలఁగుదురంతన్. ౧౫౯

సీ॥ కోటానకోటులు ♦ కుప్పఁగూరఁగఁ గూలఁ
బంచబంగాళమై ♦ పాఱ రిపులు
వెన్నాడి మాగధ ♦ వీరాధివీరులు
పాఱఁ దోలిరి యాద ♦ వప్రవరుల
కృష్ణుఁడీయోటమి ♦ నీక్షించి యన్నయౌ
బలరాముతోఁగూడి ♦ పాఱిపోయి
యనతి దూరమునందు ♦ నలరు ప్రవర్షణ
గిరిఁజేరి డాగెఁ గం ♦ దరమునందు

గీ॥ నిది జరాసంధ భూపాలుఁ ♦ డెఱిగి గిరికి
నగ్గి దాకొల్పనందుండి ♦ యన్నతోడ
మాగధునికంటఁ బడకుండ ♦ మాయమయ్యె
ద్వేత యిండ్లఁదిరుగు ప్రాఁత ♦ వెన్నదొంగ. ౧౬౦

వ॥ ఇసివి జరాసంధ సార్వభౌముండు మరలి మగధరాజ్యంబుఁ జొచ్చి మంత్రాంగంబుఁ జేయుచుండె. ౧౬౧



# హంసడిచికులమృతి.

గీ॥ మాగధపృతనాధీశుల ♦ మాత్యవరులు
హంసడిచికులు రాజసూ ♦ యాధ్వరంబుఁ
జేయసమకట్టి యుప్పుకై ♦ చీరియొక్క
బ్రాహ్మణునిఁ బంపిరప్పుడు ♦ ద్వారవతికి. ౧౬౨

ఉ॥ ద్వారక కేగి బ్రాహ్మణుఁడు ♦ పద్మదళాక్షుని దర్శనంబు ్రైవారఁగఁజేసి పిమ్మటను ♦ వచ్చిన కార్యముఁదెల్ప శ్రద్ధతోఁ
బాఱుఁడునల్కనెన్నుడుల ♦ వక్కణయెల్లను నాలకించి లో
సారెకు నీగతిం దలఁచె ♦ సాధకబాధకముల్ మురారియున్. ౧౬౩

గీ॥ "వెదుకఁబోయిన తీవెయే ♦ పదములందుఁ
దగిలె"నన్న సామెతరీతి ♦ ధరణిసురుఁడు
తంత్రమును నడ్పుచుండె హి ♦ తమ్ముఁగోరి
సంశయింపంగఁ బనిలేదు ♦ సమయమంచు. ౧౬౪

వ॥ వితర్కించి శ్రీకృష్ణుండు కొండొకసేపు మౌనమువహించి యెట్టకేలకు ధరణీసురునితో నిట్లు వచియించె. ౧౬౫

ఉ॥ ఓధరణీసురా! చని హి ♦ తోక్తులు చెప్పుము మీదుధారుణీ
నాథునితోడ యాదవుల ♦ నంట దలంగ్గరు వైరి శిక్షణ
గాథలు చెప్పనేల? యవ ♦ కర్షసహింపరు ప్రాణభీతిచే
సాధకబాధకంబు లొక ♦ సారిఁబరీక్షను జేయమేలగున్. ౧౬౬

గీ॥ ఉప్పుఁదెమ్మంచు మీతోడఁ ♦ జెప్పెనోటు!
వింతవిడ్డూరమిప్పుడు ♦ వింటిముప్పుఁ
గోరుకొల్లను దమముప్పుఁ ♦ గోరుకొనునటె
యనుచు ఖీరాజచంద్రుతో ♦ నాడఁదగును, ౧౬౭

ఉ॥ మీరలు ధర్మమూర్తులరు ♦ మేమిఁక మాటలఁ జెప్పఁబోమ దే
మారణభేరి చెప్పెదుసు ♦ మా! యతిమాత్రము మాకు మారుగా
మారణకేళి నిక్కముగ ♦ మారణకేళి విచారమేల? ని
ష్కారణయుద్ధమేమిటికిఁ ♦ గల్గునె లాభము దానఁజెప్పవే. ౧౬౮

వ॥ కావున మీరు వెంటనే చని యీ యుదంతమంతయు మీ భూకాంతుల స్వాంతంబున కెక్కునట్టు లెఱింగించి, పోలిన తెఱంగున బుద్ధులుగఱపుఁడు. మాముక్కున నావియున్నంతవఱకుఁ బరులకు జంకి యుప్పిచ్చువారము మాత్రము కాము. ధర్మయుద్ధమున వీరశయ్యాసుఖ మనుభవింప నిచ్ఛించువార మనుఁడు విప్రుండు తేచి వాసుదేవునివద్ద సెలవుంగైకొని ప్రయాణోన్ముఖుండయ్యె— అంత. ౧౬౯

కం॥ ఆనకదుందుభిసూనుం
డానక దుందుభివిరావ ♦ మతిభీషణమై
మానక మ్రోఁగుచునుండఁగఁ
బూనికఁ దన సేనఁగొంచుఁ ♦ బోరికి వెడలెన్. ౧౭౦

వ॥ అంతకుమున్నె జరాసంధుఁడు చారులవలన శ్రీకృష్ణ రణప్రారంభ మెఱిఁగి సమరోత్సాహంబున సైన్యములఁగూర్చికొని హంసడిచికులకుఁ దోడ్పడ గంగాతీరంబున దండువిడిసి యాదవసేనకై యెదురుచూచుచుండెను. కోలాహలంబుతో యాదవసైన్యంబులరుదేర దోఃకండూతినిరాసంబుగాఁ బోరఁదొడంగెను. ౧౭౧

చం॥ అలమటఁ బొందకుండఁగ బృ♦హద్రథపుత్రుఁడు వైరిసైన్యముల్
దలపడిపోరనొక్కెడ వి ♦ తాకును జెంద మఱొక్కచోట ను
త్తలపడి యాదవుల్ పఱవఁ♦దార్కొని హంసుఁడు యుద్ధమాడఁగా
విలయముఁజేయు నాడిచిక♦వీరుఁడు వేఱొకచోట నుద్ధతిన్. ౧౭౨

వ॥ ఈ వీరత్రయంబు చేయు కోల్తలకు నిలువంజాలక తలచీరలూడ
యాదవసైన్యంబు ప్రక్కలుఱుకుచుండఁ గాంచి శ్రీకృష్ణుండు సైన్య
రక్షణం బవశ్యకర్తవ్యమని నిశ్చయించి. ౧౭౩

గీ॥ డెప్పరముగ నొక్కట పోరు ♦ డిచికుకడకు
వార్తఁ బుత్తెంచె హంసుండు ♦ ప్రధనభూమి
నీల్గెనని దీని నాలించి ♦ యెన్నరాని
శోకమున మున్గి డిచికుండు ♦ శూరుఁడయ్యు. ౧౭౪

గీ॥ అన్నలేని రాజ్యంబేల? యాయువేల?
భోగభాగ్యంబు లవియేల? భూములేల?
యంచు మిక్కిలి వగచేత ♦ నౌడుఁగఱచి
గంగలోఁదూఁకి ప్రాణముల్ ♦ గంగఁగలిపె. ౧౭౫

ఉ॥ తమ్ముఁడు గంగలోదుమికి ♦ తా మరణించెనటన్న వార్త శో
కమ్మును గూర్పఁగా నడలి ♦ గ్రక్కునఁ దమ్ముఁడు లేనిరాజ్యముం
దమ్ముఁడులేని వైభవము ♦ తమ్ముఁడులేని సుఖంబులేల? నా
కిమ్మహినంచు గంగఁబడి ♦ యీల్గెను హంసుఁడు ధీరచిత్తుఁడై. ౧౭౬

గీ॥ అన్నదమ్ము లీగతిఁ దెగ ♦ టారినంత
బహుళ తత్సైన్యములు పటా ♦ పంచలగుడుఁ
బొంగి బార్హద్రథియు నాల్గు ♦ మూపులగుచు
యాదవులనెల్ల నరికట్టి ♦ యాఁగినంత. ౧౭౭

గీ॥ వాసుదేవుండు తనసైన్య ♦ పటలినెల్లఁ
జేయునదిలేక మరలించి ♦ చెప్పకుండఁ
బ్రధనభూమిని విడనాడి ♦ పాఱిపోయెఁ
బౌరుషము మాఱెఱుఁగు భగ ♦ వంతుఁడనుచు. ౧౭౮

గీ॥ మధురకడనున్నఁ బ్రాణముల్ ♦ మఱియుఁ దక్క
వంచు లోనెంచి శ్రీకృష్ణుఁ ♦ డాప్తబంధు

సుత కుటుంబసహితముగా ♦ హితులతోఁ గు
శస్థలీవిషయమునకుఁ ♦ జనఁగ నెంచి. ౧౭౯

చం॥ పడమటి సంద్రమందు ఫల ♦ వంతమునై వెలుగొందు దీవిపై
గుడులును గోపురంబులును ♦ గోటలు పేటలు రాచబాట క్రొ
త్తడములు మిద్దెమేడలును ♦ దద్దళముల్ మిఱుమిట్లుగొల్పఁ బు
త్తడి యదుసోడిగించి పని ♦ తంబుగఁ గట్టిరి ద్వారకాపురిన్.౧౮౦

గీ॥ ద్వారవతియన వెల్గు నీ ♦ పత్తనంబు
వైరి దుర్భేద్యమై యుండు ♦ వాసుదేవుఁ
డెలమి యదువృష్ణి భోజాంధ ♦ కులనుగూడి
రాజ్యమును సేయునే అద్ది ♦ అవ్వలేక. ౧౮౧

మ॥ దివ్యజ్ఞానము దివ్యదృష్టి వెలుఁగన్ ♦ దేదీప్యమానంబుగా
నేవ్యాసంగము లేక యబ్జనయనుం ♦ డేకాగ్రతన్ భూరి శ
త్రువ్యూహంబుల మంత్రతంత్రములచే ♦దూలింప యత్నింపునన్
దీవ్యత్సైన్యము గూర్చి పెట్టికొని యుం♦దేయుఁడె నిశ్చింతతో.౧౮౨

ఉ॥ ద్రావిడ జాతినిందొలఁగి ♦ ద్రావిడసంఘము పొత్తుమాని యా
ద్రావిడసార్వభౌముఁడయి ♦ దర్పముఁ జూపఁగ నెంచినందునన్
ద్రావిడులెల్ల మార్తురయి ♦ దగ్గరఁ జేరఁ గనీక పోవుటన్
ద్రోవమటొండులేక పెఱ♦ తోయము వారలఁ జేర నెంచుచున్ ౧౮౩.

గీ॥ అనువుగల్గిన యపుడెల్ల ♦ యాదవుండు
సహచరులతోడఁ జెప్పును ♦ జాత్యహంకృ
తివిడనాడి కార్యంబు సా ♦ధించుటొప్పు
బాగుపడ నెంచు వారికె ♦ ప్పాటనైన. ౧౮౪

గీ॥ దేశకాలపాత్రంబులఁ ♦ దేరిచూచి
మొనయువల్లడిఁ దప్పించు ♦ కొనుటమేలు

మొండితనమును జూపింప ♦ మొదటికంటు
నాత్మనాశంబుగల్గు న ♦ టంచు జెప్పి. ౧౮౫

మ॥ ఒకవంకన్ శిశుపాలుఁడుండ గురు యు ♦ ద్ధోద్యోగసంరంభియై
యొకవంకన్ మగధక్షితీశ్వరుఁడునై ♦ న్యోపేతుఁడై యుండ మీఁ
దను లంఘింపఁగ దాయలో కపటులై ♦ తారాడుచుండంగ వే
ఱొకవంకన్ మనమున్ సురక్షితులమై♦యుండన్ సదాశక్యమే. ౧౮౬

ఉ॥ కావున నార్యులం గలిసి ♦ కాలముఁబుచ్చుట యొప్పులేనిచో
దేవుఁడెఱుంగుఁగాదె మన ♦ తిప్పలుతప్పవు చావులక్కటా!
నావచనంబులన్ విని వి ♦ నాశముఁబొందకుఁడంచు నార్య థా
త్రీవరమైత్రి కిష్టపడు ♦ రీతినిఁ జేసి స్వజాతివారలన్. ౧౮౭

ఉ॥ అంతకుమున్నె పాండునృపుఁ ♦ డంతలపొంతలచుట్టమాటచేఁ
జింతయొనర్చుచున్ సవతి ♦ చెల్లెలిఁ జత్రను గ్రీడికిచ్చెఁబో
పంతముతో సహోదరుఁడు ♦ వద్దనిచెప్పుచుఁ బట్టుఁబట్టినం
గంతులువైచునగ్రజుని ♦ కండ్లకుగంతలుకట్టి మాయుచున్. ౧౮౮

గీ॥ కొన్నియేఁడులిట్టులు కడ ♦ చన్నపిదప
నన్నకూతురి మేనల్లుఁ ♦ డర్జునాత్మ
జుఁ డభిమన్యునకు నొసంగి ♦ సోదరుండు
వలదు వలదన్న దొంగపెం ♦ డిలినిజేసె. ౧౮౯

సీ॥ సురటిమై యుయ్యాలలో ♦ జొంపాలో యనుచుండు
నెమ్మియీఁకలకుంచె ♦ నెత్తిఁజూచి
"నాపితృవ్యసుతుండు ♦ నళినాక్షుఁ డ"నిచెప్పు
నేకలవ్యునిమాట ♦ లాకలించి
"నన్నుఁ బెండ్లాడవా ♦ నాముద్దు చినకృష్ణ"
యనెడి చెంచెతపల్కు ♦ లాలకించి
కారుమబ్బులతోడఁ ♦ గయ్యమాడఁగఁజాలు
నిద్దంపుమైచాయ ♦ నిగ్గుఁగాంచి

గీ॥ చెంచులకు నింటివేల్పయి ♦ మించుకృష్ణు
నేకులమునందు నేజాతి ♦ నెందు బుట్టె
ననివితండ వాదముఁజేయ ♦ నగునెచెపుమ
తేటపఱచవే యవియెల్లఁ ♦ దెల్లముగను? ౧౯౦

ఉ॥ కిట్టని మాటయానె? యొక ♦ కేలను వేణువుగల్గఁ మాళిపై
నట్టువపిట్టకుంచియుక ♦ నంబడుచుండఁగఁ జెంచువారితోఁ
జుట్టరికంబు గల్గఁగడుఁ ♦ జొక్కపునల్లనిమేనిచాయక
న్పట్టఁగఁ జెంచుకాఁడనుచు ♦ వాకొన సత్యవిరుద్ధమేకదా. ౧౯౧



# ఏకలవ్యుని వృత్తాంతము.

గీ॥ అఖిలయదువృష్ణి భోజాంధ ♦ కాదిజాతు
లన్నితొలుదొల్త మ్లేచ్ఛులై ♦ యున్నఁబిడియె
నార్యజాతికి భిన్నంబు ♦ అగుటచేత
నడవిపల్లెలు కాపురం ♦ బగుటచేత. ౧౯౨

గీ॥ ఆర్యసంబంధమునుబొంది ♦ యణఁగిమణఁగి
వర్తిలుటచేత శ్రీకృష్ణు ♦ వంగసంబు
క్రమముగా గడించెను గొంత ♦ గౌరవంబు
దానఁబరులుమ్లేచ్ఛులనుట ♦ మానినారు ౧౯౩

కం॥ ఆర్యజనాచారంబులు
నార్యమతవిశిష్టధర్మ ♦ మనుపమమనుచుఁ
గార్యజ్ఞులగుచు యాదవ
వర్యులు గైకొన్నవారు ♦ బ్రహుపడివానిఁ. ౧౯౪

గీ॥ ఆర్యజనులకు "దాసోహ" ♦ మనినయాద
వాళి మ్లేచ్ఛదశనుబాసి ♦ యబ్బురముగ
క్షత్రియత్వంబొకలవలే ♦ శంబుఁబొంది
బొమ్మికములేని రాజులై ♦ పోయినారు. ౧౯౫

గీ॥ జాతివిడనాడి తొలఁగుట ♦ జాతిధర్మ
ములను సంత్యజించుట పాప ♦ మూలమంచు
జాతివీడకనిల్చిన ♦ శబరులెల్ల
శబరులుగనుండి పోయిరీ ♦ జగతియందు. ౧౯౬

కం॥ అభిమానంబునఁ బెనఁగుచు
వ్యభిచారముసల్పఁ బోక ♦ వర్తిలువారల్

శుభములఁ బొందంజాలక
యభిఘాతములందు టొక్క ♦ యబుబురమగు నే? ౧౯౭

క॥ ఆర్యులపురములఁ గని యని
వార్యంబగు సంతసంబు ♦ పరిగొనఁగా నా
యార్యులరీతిగ నుండఁగఁ
బర్యాలోచించి మోహ ♦ పరవశులగుచుర్.  ౧౯౮

చం॥ వనములనుండలేక యదు ♦ వర్యులు కొందఱుసంభ్రమంబునన్
దనియక కొంచెమేని నవ ♦ నాగరికంబును బొందఁగోరి ప
త్తనములఁ గట్టుకోఁదలఁచి ♦ దారసుతాదులఁగూడి యేడకో
చనిరినితాంతహర్షమునఁ♦జయ్యనఁబిమ్మటనొక్కయిమ్మనన్ ౧౯౯

క॥ అధికోత్సాహంబున మరి
పృథుసామర్థ్యంబున యదు ♦ వృష్ణ్యంధకులున్
మధురాపురి నిర్మించిరి
ప్రథితంబుగ నెల్లవారు ♦ ప్రస్తుతిసేయన్. ౨౦౦

క॥ వసుదేవాదులు తమ దా
రసుతాదులఁగైకొని మధు ♦ రాపురమునకున్
వసియింపఁగఁ బోయిరచట
వసతి గలదటంచు భోగ ♦ భాగ్యములందన్. ౨౦౧

క॥ పిమ్మట నావసుదేవుని
తమ్ముఁడ "నాధృష్టి"యనెడి ♦ దావిడవరుఁడున్
సమ్మతిపడఁడయ్యె నర
ణ్యమ్ముల దిగఁబెట్టి పోవ ♦ నానగరునకున్. ౨౦౨

వ॥ అనాధృష్టికి నశ్మకి శ్రుతదేవయను కళత్రద్వయంబుకలదు. శ్రుతదే వయందు శత్రుఘ్నుండను నామాంతరముగల యేకలవ్యుండు జని యించి మహావీరలక్షణ లక్షితుండయి పెరుగుచుండ నొక్కనాఁడు

తండ్రియగు ననాధ్ధృష్టి కొడుకుంజూచి యనురాగంబున నిట్లనియె. "కుమారా! శస్త్రాస్త్ర విద్యాప్రాగల్భ్యంబు మనకుఁ దరతరంబుల నుండి కలదు అదిమనకక్కఱకు వచ్చున ట్లితరులకురాదు. మహా దరణ్యానిఁ గాపురముంటిమి, ధనుర్గురుండగు ద్రోణాచార్యుని కడ కుంబోయి, ధానుష్కశేఖరుండవై రమ్మనవుఁడు. ౨౦౩

ఉ॥ మేచకదేహకాంతి మిఱు ♦ మిట్లు గొనం, దల మేచకంబు వ్యా
కోచముగాఁగ విల్లును, ల ♦ కోరులునింపిన తూణయుగ్మముం
గోచతనంబుఁ బోవిడచి ♦ కుఱ్ఱఁడు గైకొని, కాసెఁ గట్టి సం
కోచముమాని కూర్మిపిత ♦ కుం నతిసేసి సెలంగిపైనమై ౨౦౪

క॥ చని ద్రోణాచార్యునిఁగని
ప్రణతియొనర్చి విలువిద్య ♦ పారము ముట్టం
దనకుం నేర్పుఁడటంచును
వినయంబున వేడి వేడి ♦ విఫలుండగుచుం. ౨౦౫

వ॥ మగిడి కాననసీమకుంబోయి జనకుంగాంచి విషణ్ణచిత్తుండై దైన్యం బున సర్వంబు వినిపించి, రెట్టించిన పట్టుదల నెట్టయిన నస్త్రవిద్యా పాండిత్యము సాధింప దీక్షవహించి పరాకాష్ఠతో నేకాగ్రచిత్తుం డై ద్రోణుని ప్రతిరూపంబున దృష్టినిబద్ధముంజేసి, దృఢముష్టి లక్ష్యలాఘవంబుల నిరంతరాభ్యాసపటిమంబుచేఁ గౌశలంబు సంత రించి, యొరులు తేరిచూడఁగరానిరీతి విక్రమోపేతుండై వెలుచుఁ దన యశశ్చంద్రికలు గగనసీమ నాల్గుకోనలు వ్యాపింపఁ దేదీప్య మానంబుగా విరాజిల్లుచు జనకుని మరణానంతరము రాజ్యంబు వహించి పూజ్యభావంబునఁ బ్రజలను గాపాడుచుండెను. ౨౦౬

సీ॥ కన్నుఁ బొడుచుకొన్నఁ ♦ గనరానియడవులఁ
జిమ్మచీఁకటులెల్లఁ ♦ జిమ్మివైచె
కాలు వెట్టఁగరాని ♦ కఱకునేలలనెల్ల
సవరించి తిన్నఁగా ♦ సాఁగుచేసె

వన్యమృగంబుల ♦ వల్లడిఁ దప్పింప
వలఁజుట్టి దిట్టమౌ ♦ వెలుగు వేసె
చిలుగుతోడుగుకంపఁ ♦ జెలగి వేయుచునుంచి
యాఁకతోఁటలగుంపు ♦ నలవరించె

గీ॥ పోసరించిన బలుదిట్ట ♦ పోటు బంటు
లోర్మిఁ దనయాజ్ఞఁ బాలించు ♦ చుండ నెపుడు
ధర్మమొకవీసమేనియుఁ ♦ దప్పకుండ
నేకలవ్యుండు రాజ్యంబు ♦ నేలుచుండె. ౨౦౭

వ॥ చెంచుతేని యటవీరాజ్యంబున నాకలిదగదప్పలెఱుంగక, కుసిలింత
లెఱుంగక యసంతుష్టియెఱుంగక, ౨౦౮

గీ॥ పుట్టతేనెగలిపి ♦ ముదురు వెదురు ప్రాలు
కడుపునిండఁ గుడిచి ♦ గట్టుమంచుఁ
ద్రేచి తనివిఁ జెంది ♦ తిరుగాడుదురు తప్పు
లెంచరానివారు ♦ చెంచువారు. ౨౦౯

గీ॥ పాయకట్టుకట్టుఁ ♦ బాయఁ గొట్టఁగ లేరు
మాసటీఁడులైన ♦ మనుజులైనఁ
పలికి బొంకువారు ♦ గలుగఁ బోవరుసుంత
యేకలవ్యనృపతి ♦ యేలుబడిని. ౨౧౦

ఉ॥ ఏసినతూపుతప్పిచని ♦ యెప్పుడు ఱిత్తగఁ బోవలేదొరల్
దీసినకత్తియెప్పుడని ♦ దీర్పకయుండఁగ లేదు భీతిచేఁ
డాసినవారికెప్డు శర ♦ ణంబునొసంగమి లేదు వానికై
వాసిగ నేకలవ్యుసరి ♦ బంటొకఁడుండుగలండె భూమిలో? ౨౧౧

గీ॥ యదుకులంబునఁ బ్రభవించి ♦ నట్టివాఁడు
కాననాంతర రాజ్యంబు ♦ గలుగువాఁడు
వినుము కృష్ణునిపినతండ్రి ♦ యనుఁగుబిడ్డ
యేకలవ్యుండు శబరజా ♦ త్యేకవిభుఁడు. ౨౧౨

ఉ॥ జాతినిబాసి తామయిన ♦ క్షత్రియులంచుఁ దలంచి గొప్పఁగా
నేతుమటంచు నిక్కుచును ♦ నీఁగెడివారలతోడఁ బోకహో!
జాతిని ధర్మముల్ విడువఁ ♦ జాలనివారికిఁ జెంచువారికిన్
భూతలనాథుఁడై వెలసెఁ ♦ బోటరి మాటరి యేకలవ్యుఁడున్. ౨౧౩

గీ॥ అరయ రెండుపాయ ♦ లైన యాదవులకు
నుద్దిలేనిరాజు ♦ లిద్దఱైరి
యొకరు మధురలోన ♦ నొక్క రడవియందుఁ
గృష్ణుఁ డేకలవ్యుఁ ♦ డేలుచుండ్రు. ౨౧౪

ఉ॥ వెన్నునిఁ గన్నఁ గన్నెఱుపు ♦ వెక్కసమౌఁగద చెంచుతేనికిన్
వెన్నుని మాటయన్నఁ బ్రభ ♦ వించెడివేరము చెంచుతేనికిన్
వెన్నుని బూటకీఁడనుచు ♦ నిక్కుచుఁ జెప్పును నేస్తకాండ్రతో
వెన్నునినమ్మఁ డెన్నఁడును ♦ వీరశిఖామణి యేకలవ్యుఁడున్. ౨౧౫

శా॥ జ్ఞాతిద్రోహి యధర్మమంచు ననకే♦స్వార్థం బపేక్షింపుచున్
జాతిన్వీడి యొనర్చె నార్యతతితో♦సంబంధ బాంధవ్యముల్
గోతం బెట్టెదనంచునుండు శబర♦క్షోణీశుఁ డత్యుగ్రుఁడై
"జ్ఞాతిశ్ఛేదన లేనకిమ్మ" నెడి వా♦క్యస్ఫూర్తి దీపింపఁగన్. ౨౧౬

ఉ॥ ఏతరి నేకలవ్యు మొగ ♦ మించుక చూచినఁ గృష్ణుఁడద్దిరా!
యీతఁడు జాతిజాతియని♦యెప్పుడు త్రుళ్ళుచుఁ గల్వరించుచున్
జాతిని గూడియుండు నతి ♦సాంద్రవనంబుల జాతివైరమున్
సైతము మానఁడంచు నెక♦సక్కెములాడుచు గేలిసేసెడిన్ ౨౧౭

వ॥ ఇట్లు పరస్పర విరోధభావంబులచే భావంబులు కలవరపడుచుండ.

చం॥ గరువతనంబుచేతఁ జెలి♦కాండ్ర నొకానొకనాఁడు గూడుచున్
గురుతర కాననస్థలికిఁ ♦ గోయని యార్చుచుఁ బోయి యందఱున్
గరమరుదైనవేట తమ♦కంబున రేఁగుచు సంచరింపుచున్
దరమిడి క్రూరజంతువుల ♦ దద్దరిలంగను జేయుచున్నెడన్. ౨౧౮

గీ॥ కఱకు పదనుగల్గు ♦ కాండంబు నొకదాని
వింటఁదొడిగి పంది ♦ వెంటఁ బడుచు
నేకలవ్యుఁ డొక్కఁ ♦ డే కాకియైపోయి
యేకలంబు సురుగ ♦ నీక తఱుమ. ౨౨౦

ఉ॥ కొండొకవైపునుండి రణ ♦ కోవిదుఁడైన కిరీటి యప్పుడే
కాండము వింటనుందొడిగి ♦ గమ్మున నేసెను వేసినంతనే
యొండొకబాణమో రభస ♦ మొప్పఁగ తిన్నన వచ్చి నూటగా
నిండుమొగంబుఁదాకి ధర♦ణీస్థలిపైఁ బడఁగూల్చెఁబందినిన్. ౨౨౧

గీ॥ లక్ష్యశుద్ధి యద్భుత శర ♦ లాఘవంబుఁ
గాంచి నరుఁ డేకలవ్యునిఁ ♦ గంటఁజూచి
యీడుగాననిచెప్పి తా ♦ నీడఁబోయి
తేరి పాఱఁజూచి యపుడె ♦ తిరిగిపోయి. ౨౨౨

కం॥ ఇంతటి విద్యానైపుణి
యింతటి శరలాఘవంబు ♦ నెన్నం డెఱుఁగన్
వింతకదా! యితఁ డెవఁడో
యం తెఱుఁగుట మేలటంచు ♦ నాతండపుడే. ౨౨౩

వ॥ చాపాచార్యుండగు ద్రోణాచార్యునిం జేరి వినయం బుట్టిపడ దీనా
ననుండై. ౨౨౪

కం॥ ఎఱుకొక్కనిఁగంటిని ద
చ్ఛరలాఘవమెల్లఁ గంటి ♦ సాంద్రాటవిలో
గురువర! యాతని రూపము
మఱవఁగ రాదయ్యె నాకు ♦ మాపులు రేపుల్. ౨౨౫

గీ॥ మూఁడులోకాల విలుకాండ్ర ♦ మొత్తమందు
నన్ను సరిలేనిబంటు నో ♦ నర్తునంటి
వదియు నేఁటికి వమ్మయ్యె ♦ నక్కటకట!
మీర లేమిసేతురో నాథ ♦ మేలునేఁడు. ౨౨౬

గీ॥ సరియె కాదయ్య నాకంటె ♦ నురువగునతఁ
డెచటనేర్చెనో విలువిద్య ♦ నెఱుఁగరాదు
బాసమాత్రము తీర్చుకో ♦ వలయునన్న
గురుఁడు చింతించి మిగుల సం ♦ కోచపడుచు. ౨౨౭

ఉ॥ వెంటనె క్రీడిఁగూడి యట ♦ వీస్థలికేగ గురుఁడు సిద్ధమై
జంటఁగనంటి వెంటఁబడి ♦ ఛాత్రుఁడు ముందుగ దారితీయ గో
రింటల డొంకలన్ నడచి ♦ త్రిప్పలుపొందుచుఁ గాంచిరొక్కెడన్
వంటెముకాని గూడెమును ♦ వారలు దానిని డాసి నంతటన్. ౨౨౮

సీ॥ నెట్టెంబుఁ గైసేయు ♦ నెమ్మిపురి తురాయి
కనువిచ్చి దెసలెల్లఁ ♦ గాంచుచుండ
దొనల రా పుచే ♦ తను గాయగాసిన
యెగుమూపు దోయిమై ♦ బిగువుచూప
ఎన్నెన్నొ కత్తరి ♦ వన్నెపూసలపేరు
లెదురొమ్ముపైఁబడి ♦ కదలుచుండ
మొలచుట్టు చుట్టిన ♦ మోటువన్నియప్రాత
మోకాలు దిగజారి ♦ పోకయుండ

నింటిముంగలి యఱుగుపై ♦ నొంటరిగను
రెడ్డిగమువేసి కూర్చున్న ♦ దొడ్డతేని
శబరజాతి క్షమానాథు ♦ శౌర్యరాశిఁ
గాంచి గురుశిష్యులిర్వురు ♦ కొంచెపడిరి. ౨౨౯

గీ॥ అతిథు లిద్దరింటికి వచ్చు ♦ టల్లకాంచి
దూరముననుండి తొందర ♦ తోడ లేచి
యర్ఘ్యమును పాద్యమునునిచ్చి ♦ యాదరించి
వారి పయనంపు బడలికఁ ♦ బాపనెంచి. ౨౩౦

మత్త॥ చారపప్పును సూచబియ్యము ♦ సన్నమండిగ గుగ్గిళుల్
దోరముగ్గిన మావిపండులు ♦ దుర్లభంబగు ద్రాక్ష ఖ
ర్జూర పక్వఫలాళి తంగెటి ♦ జుంటితేనియుఁ జక్కఁగా
నారకాగిన యావుపాలను ♦ నారగింపఁగఁ బెట్టుచున్. ౨౩౧

కం॥ ఇంటికి వచ్చినపెద్దల
వెంటనె పూజించునియతి ♦ విహితంబుగఁ జే
కొంటిమి యాతిథ్యమె మా
పంటలు వీనిఁగొని సేదఁ ♦ బాపుకొనుండీ. ౨౩౨

వ॥ అని బహుప్రకారంబుల వేడిన ద్రోణార్జును లతిథి సత్కారముల గ్ర
హించి తృప్తులైన యనంతరంబువారలంజూచి యేకలవ్యుండు. ౨౩౩

ఉ॥ ఏపనిఁబూని మీరలిటు ♦ లిచ్చటికిం జనుదెంచినారు? మీ
కాపురమేది? నావలనఁ ♦ గాఁగల కార్యముఁజెప్పఁ దున్నచో
నాపనిఁదీర్తు నాకలవి ♦ యైన నటంచు వచించినంతనే
చాపగురుండు పల్కెను ని♦జంబును దెల్పుచుఁదత్క్షణంబునన్. ౨౩౪

కం॥ నాపేరు ద్రోణుఁడందురు
చాపాచార్యుండ నిఖిల ♦ జనపాలసుతుల్
నాపజ్జ నేర్చికొందురు
చాపాభ్యాసంబు దివ్య ♦ శరలాఘవమున్. ౨౩౫

ఉ॥ క్రీడియితండు ఘోరరణ ♦ కేళివిదగ్ధుఁడు మొన్న మొన్న వేఁ
టాడఁదలంచి యీ యడవి ♦ యందునఁజొచ్చి చరించుచుండఁగాఁ
గ్రోడముతోడవచ్చి యిట ♦ నొక గుటివెట్టి శరంబుఁబుచ్చఁ దో
డ్తోడఁద్వదీయబాణముక♦దుర్దరయమారఁగ దానిఁగూల్చుటన్. ౨౩౬

ఉ॥ నీశరలాఘవంబు గని ♦ నివ్వెఱపాటునయంగ వేగ నా
వేశముఁజొచ్చి యీమెడకు ♦ వ్రేల్మిడిఁదెచ్చెను నిన్నుఁజూడఁగా
నోశబరేశ్వరా! పలుక ♦ నోడకు పేరు నుదంతమెల్ల నీ
వీశరవిద్య నెప్పుడెటు ♦ లెవ్వనివద్దను నేర్చినాఁడవో. ౨౩౭

కం॥ అనినంత నేకలవ్యుఁడు
వినయాదర మొప్పుచుండ ♦ విస్పష్టముగాఁ
దనగురునితోడను బలికెఁ
గనుదమ్ములవింతకాంతి ♦ గంతులువైవన్. ౨౩౮

కం॥ ఏమేమీ! యితఁడజ్ఞునుఁ
డా? మీరలు ద్రోణగురువు ♦ లా? మోదంబా
హా! మీరాకను ధన్యుఁడ
నే మీకడఁగాదె విద్య ♦ నేరిచికొంటిన్. ౨౩౯

వ॥ ఈమాటలాలించి ధనురాచార్యుండు కలగుండువడిన మనంబు కలవాఁడై, బోయతుంటరియై, మెఱమెచ్చులకో, మిడిమేలమునకో, మేలమునకో యిట్లాడుచుండెనని సంశయించి, యేకలవ్యుని ముఖలక్షణంబుల నుపలక్షించి, విలక్షణంబులేమియుఁ గన్పట్టమిఁ, గుదుటఁబడినమనంబుకలవాఁడై. ౨౪౦

ఉ॥ చిత్రముఁజెప్పుచుంటివి, హ ♦ సింపఁగనేమొకొ నిన్నెఱుంగఁబో!
ఛాత్రుఁడవై మముంగొలిచి ♦ సాంగముగా విలువిద్యనెన్నఁడే
మాత్రము నేర్వవీవిటుల ♦ మాటలుచెప్పఁగనేల? నీదుచా
రిత్రమువిస్మయంబుఁబచ♦రించెడియంచువచింపఁబోయెడున్. ౨౪౧

చం॥ ఎఱుఁగకపోవుటేమిననుఁ? ♦ నే విలువిద్దె గ్రహించు కోర్కెతోఁ
జిఱుతతనంబునందు మిముఁ ♦ జేరి భయంబునఁ జాఁగివేఁడఁగా
నెఱుకకుఁజెప్పరాదనుచు ♦ నెన్నియొ శాస్త్రములున్నవందుచేఁ
గఱపఁగజాలనంచు ననుఁ ♦ గత్తరిమాటలనాడి పంపరే. ౨౪౨

గీ॥ అట్లు మీచేత నవమాన ♦ మంది దుఃఖ
తాత్ముఁడనయి యేమియుఁదోఁచ ♦ కలమటించి
యుంచుకంతవంచిన తల ♦ యెత్తకుండఁ
దిరిగి మాచెంచుగూడెంబు ♦ దరియఁజొచ్చి. ౨౪౩

కం॥ సతతము గొలిచితి నేమీ
ప్రతిమారూపంబు భక్తి ♦ పరతంత్రుఁడనై
జితకాశినైతి దానన్
గృతహస్తుఁడనైన నాకు ♦ నెదురు నెఱుంగన్. ౨౪౪

వ॥ నాపేరేకలవ్యుండు; ఈ యాటవిక ప్రదేశంబు మదీయ బాహువప్రయుగళీగుప్తంబై, దొంగ తోడుబోతులవలని వల్లడిదక్కి చల్లగ వర్ధిల్లుచుండు. నాకదురుగాని యెదురుగాని లేక యుండె వసియింతు. ౨౪౫

ఉ॥ మాకొరవంజిగూడెములు ♦ మాటలుతప్పవు తప్పినంతనీ
లోకములోనఁ బుట్టుగతు ♦ లున్ మరియుండవు చుట్టపక్కముల్
బాకులుదూసి మీఁదఁబడి ♦ ప్రాణములన్ హరియింతురట్టి యీ
మాఁకలకెల్లనే దొరను ♦ బొంకులెఱుంగని కారుకోనలో. ౨౪౬

ఉ॥ అంతట ద్రోణుఁడిట్టు హృద ♦ యమ్మునఁ దాఁదలపోయఁజొచ్చెవీఁ
డంతక కల్పుఁడీతవి యు ♦ దంచితభీషణబాహుశౌర్య వి
క్రాంతియు వీనినిస్తుల ప ♦ రాక్రమ మీతనిచాపవిద్య, ప్రా
ణాంతకమార్యకోటికెటు ♦ లైననుహీనునిఁజేయుటొప్పగున్ ౨౪౭

గీ॥ వీనివింటికి నెదురెత్తి ♦ వింటినారి
లేశమైనను మోగింప ♦ లేఁడెవండు
వీని భుజశక్తిఁ బొరిపుచ్చ ♦ లేనియెడల
మాకు బ్రదుకుట దుర్లభం ♦ బ యనియెంచి. ౨౪౮

కం॥ ఎఱుఁగవె శిష్టాచారం
బొఱఁగియు నిట్లాచరింప ♦ నెఱుకకుఁదగునే
గురుదక్షిణఁ బెట్టనియా
కఱటికి సద్గతులు పుట్టఁ ♦ గలవే యెందున్? ౨౪౯

వ॥ ఇట్లు గురుండు కుత్సితుండై, తనయభీప్సితంబును మఱుఁగుపుచ్చి, పల్కిన వెంటనే యేకలవ్యుండు. ౨౫౦

చతుర్థాశ్వాసము.

క॥ "తలతలమను కత్తిదిగో!
తలయిదిగో! కోరుకొన్న ♦ దానిని నిపుడే
తలఁగకయిచ్చెద గురువర!
తలఁగోసిమ్మనుదో" లేక ♦ ధనమిమ్మనుదో! ౪-౧

క॥ చెడుతలఁపున ద్రోణుండ
ప్పుడు పలికెను నాకదేది ♦ పోలదుగానీ
కుడిచే బొటనవ్రేలొ
క్కఁడు చాలును దానినిమ్ము ♦ గురుదక్షిణగా. ౪-౨

ఉ॥ చెంగటనిల్చి కుంభజుఁడు ♦ చెప్పినమాటలనాలకించి యం
దుంగల మోసముం దెలిసి ♦ తొట్రిలకుండఁగ నేకలవ్యుఁడా
యంగుటముం గరుక్కున ♦ కాసినిగోసి యదే గ్రహింపవే
వెంగలికాఁడ హా! శబర ♦ వీరుఁడు బాసనుదప్పఁడెన్నఁడుఁ ౪-౩

వ॥ ఇట్లు వచించి నిర్వికారంబున. ౪-౪

చం॥ తలతలలాడు కత్తి నోఁటఁ ♦ దాల్చి విషణ్ణతఁ బొందకుండఁగా
జలజలరాలుచున్న క్షత ♦ జంబును సురతియు లెక్కపెట్టకే
కలకలలాడు నెమ్మొగము ♦ కాంతులు పర్వఁగ మాటలాడఁగా
బలపలనొచ్చు ద్రోణుఁడును ♦ ఫల్గునుఁడంతట బిత్తరింపుచున్ ౪-౫

గీ॥ ఏకలవ్యుని గురుశిష్యు ♦ లిర్వురంత
చిట్టకంబునఁ బొడఁగాంచి ♦ సెలవుఁబొంది
కోర్కెలీడేఱెనని చెప్పి ♦ కులుకుతోడ
మరలిపోయిరి తమవీటి ♦ తెరువుఁబట్టి. ౪-౬

వ॥ ద్రోణార్జునులు మఱిడిపోయినపిమ్మట నేకలవ్యుండట తన మనంబున
నిట్లు తలపోయసాఁగెను. ౪-౭

చ॥ గురుఁడఁటవీఁడు నన్ను వెడ ♦ కోర్కులుగోరుచునంగుటంబునన్
నఱకఁగఁజేసికైకొనియె ♦ న్యాయమ? శిష్యునిఁ బుండలింపఁగా
గురుజనుఁడున్ స్వలాభమును ♦ గోరఁగవచ్చునుగాని శిష్యునిన్
గరుణయొకింతలేక యప ♦ కారమునన్ గ్రసియింపధర్మువే? ౨౫౮

కం॥ చింతింపక యొకనికినై
యంతఃకరణప్రవృత్తి ♦ నావలనిడెఁబో
యంతే! వాసిచెఱుచుకొనె
నంతేవాసి చెడఁడింత ♦ యైననుగనుఁడీ. ౨౫౯

వ॥ హృదయంబు కలవరపడుచుండఁ దన్నుదా నూరడించుకొని. ౨౬౦

గీ॥ కృష్ణమూర్తి మేనత్తయా ♦ పృథకుఁ గొడుకు
నరుఁడు వానిగురువు చాప ♦ గురుఁడుగానఁ
గృష్ణుఁడీపనియెల్లఁ జే ♦ యించియుండు
వేఱువిధముగాఁ దలపోయ ♦ వీలులేదు. ౨౬౧

వ॥ ఇంతమాత్రంబునకు నైనదియేమి? త్రిజగంబులు విస్మయంపడ శ్రీ
కృష్ణుండు సంగ్రామరంగంబున నా ప్రళయతాండవముం గనుం
గొని ఱిచ్చపడుఁగాక. ౨౬౨

సీ॥ అడ్డంబువచ్చిన ♦ హరిహరాదులనైన
"ఉష్ఫ"ని క్షణములో ♦ నూదివైతు
శ్రీకృష్ణుఁడేవచ్చి ♦ డీకొన్నచో వాని
వేటారుతునియల ♦ విఱుగవైతు
దండెత్తిపోయినే ♦ ద్వారకావతిలోన
దండాటలాడింతు ♦ దండునెల్ల
పాండుపుత్రకులె తో ♦ డ్పడవచ్చుచో ముట్టి
పిలుచవారల తలల్ ♦ దులిచిపుత్తు

గీ॥ వెలయఁ బది వ్రేళ్ళలో నొక్క ♦ వ్రేలుపోయి
నంతమాత్రాన నేమి దు ♦ రాశగాక?
ఏకలవ్యుండు సర్వలో ♦ కైక ధార్మి
కుండనఁగ మాఱు మ్రోగింతుఁ ♦ గుతలమెల్ల. ౨౬౩

వ॥ అంచు రోషించి మంచికాలరులఁబంచి, చెంచు గూడెములనుంచి చెంచుదొరలం బిలిపించినఁ బేరుమోసిన సెలవిలుకాండ్రు, తడవిలుకాండ్రు, వెదురువిలుకాండ్రు, వెడవిలుకాండ్రు నెదురులేక యొకరి నొకరు పిలుచుకొని మించిన భక్తితోఁ జేనికడకురా నేకలవ్యుండు రణభేరి వేయించి పైనంబుఁ జేసి ద్వారకాపురినిడాసి, చుట్టుముట్టి పైఁబడియాయాదారుల నెల్ల నరికట్టి పురంబుననున్న సరదారుల నాదారులంజేసి, కట్టెదుటనున్న తోఁటలను, దొడ్లను బాడుచేసి, జోదుల పెక్కండ్ర మడియించి, కృష్ణుండు లేమిచే మగిడివచ్చె. పదంపడి కొండొక కాలంబున మరల యుద్ధంబు ప్రవర్తింప నందు నన్యాయంబుగాఁ గృష్ణునిచే నతఁడు నిహతుండయ్యె. ౨౬౪



# ధర్మజు రాజసూయము.

వ॥ నిరంతరఘోరసంగ్రామవ్యాపారసంక్షుభిత మనస్కుండై శ్రీకృష్ణుండొక్కనాఁడేకాంతంబున, నవరత్నఖచితకుడ్యవరిభ్రాజమాన నిజసౌధాభ్యంతర చంద్రశాలలో, సాంద్రచంద్రమరీచిజాలంబు, హృదయాహ్లాదంబు కలుగఁజేయుచుండ నెమ్మదిఁ గూర్చుండి యిట్లు తలపోయసాఁగెను. ౧

కం॥ మురనరకాసురసడిబకశ
కటభూవరకంసముఖర ◆ పరనరవరులన్
బోరఁగొనితి నను టెకాసీ
తెఱుఁగునయంతిని గంటినిండ ◆ నెన్నఁడునిద్రన్. ౨

సీ॥ ఒకమూలమాగధుం ◆ డూర్జితసత్వుఁడై
దండెత్తిపైఁబడఁ ◆ దలఁచుచుండ
ఒకవంకశిశుపాలుఁ ◆ డుద్భటారభటితోఁ
గోలాహలముఁజేయఁ ◆ గొంకకుండ
ఒక చెంప పౌండ్రకుం ◆ డుత్సాహవంతుఁడై
డెప్పరంబుగ ముట్ట ◆ డింపనుండ
ఒకప్రక్క సాల్వుండు ◆ వికటాట్టహాసియై
కైలాటములుపెట్టఁ ◆ గదలుచుండ

గీ॥ కాలయవనుడొక్కట నొడు ◆ గఱచుచుండ
దంతవక్త్రుండు తనదండఁ ◆ దట్టుచుండ
వీరిబారిఁ దప్పించుక ◆ వేగుటెటులొ!
కలలలో వీరిమూర్తులే ◆ కానిపించు. 3

కం॥ వినరాదు వీరి పల్కులు
కనరాదిసుమంత వీరి • కార్యచయంబున్
మనరాదు వీరిపొత్తునఁ
జనరాదొకయింత వీరి • సంగతికొఱకై.  ౪

సీ॥ ఆర్యసంఘంబుతో • నైక్యమైతినటంచు
మాజాతివారెల్ల • మసకపడుచు
ననుఁజూచి కినుకతో • నాయుండు లేనితఁ
ప్పులమోపి దప్పుగాఁ • దొలఁగిపోరు
చతురంగసైన్యంబు • సమకూర్చి నిరతంబు
వెంటాడుచుండిరి • విసుగులేక
కంటినిద్రయెఱుంగఁ • గడుపుకూడు నెఱుంగఁ
జాలకాలమునుండి • జడుఁడనైతి

గీ॥ నొంటరిగ వీరితోఁబోరు • చుండలేక
జన్మభూమిని గాపాడు • శక్తిలేక
కానిద్వీపంబులో నిల్లు • గట్టుకొనుచు
నిట్టులారాటపడుచుంటిఁ • బుట్టుతుదకు.  ౫

గీ॥ పాపియగు జరాసంధుఁడై • శ్వర్యమత్తుఁ
డగుచు రాజచక్రము నెల్ల • నానకట్టి
తోలుచుండె నామీఁద • ధూరుఁడతఁడు
జాతివిద్రోహివని చెప్పి • సాటువాటిట.  ౬

గీ॥ అతనిపేరు సింహస్వప్న • మగుటచేతఁ
దొలఁగియుండుట లగ్గంచుఁ • దలఁచినేను
మధ్యదేశంబు నెడఁబాసి • మాటుపడుచు
వచ్చియుండుంటి బాంధవ • వ్రజముతోడ.  ౭

కం॥ ఎచ్చటి పచ్చికబీళ్ళను
విచ్చల విడిమేయు, ధేను ♦ విసరంబులునా
కిచ్చినవౌ గుమ్మపాలను
నచ్చటి భూములను వీడ ♦ నాడఁగవలసెన్. ౮

గీ॥ జన్మభూమియహా మధ్యదే ♦ శంబునందు
నిలువనీడ లేకుండఁజేఁ ♦ గలిగినాఁడు
వీనిరాజ్యంబు కూఁకటి ♦ వ్రేళ్ళతోడఁ
బెళ్ళగింపకుండినఁ బేరు ♦ పెంపు చెడును. ౯

కం॥ ద్రావిడజనముల పంచకుఁ
బోవక యెల్లైన నార్య ♦ భూమీశ్వరులా
పోవఁదలలోని నాలుక
కైవడినే సంచరింతుఁ ♦ గార్యార్థుఁడనై. ౧౦

సీ॥ సంజకెంజాయలోఁ ♦ జలువవెన్నెలమీఁద
విరమించు భాగ్యంబు ♦ వెడలిపోయె
పండువెన్నెల నారు ♦ బైటలోఁ బవళించు
సౌభాగ్యగరిమంబు ♦ సమసిపోయె
ముప్రొద్దులందుఁ బు ♦ ప్పొడి దుమారంబులో
మునిఁగి తేలుట యెల్ల ♦ ముగిసిపోయె
పున్నాగములకూడి ♦ పున్నాగములనీడ
పన్నాగములఁబన్ను ♦ చెన్నుపోయె

గీ॥ జన్మశతములకైననా ♦ జన్మభూమి
సౌఖ్యములమాట మఱవంగఁ ♦ జాలనౌర
రాజచండాలుఁడైన జ ♦ రాతనూజు
వల్లనింతవల్లడిగల్గె ♦ వల్లమాని. ౧౧

కం॥ అమ్ముడువోయితిననుచున్
సమ్మతిఁ జూపింపలేక ♦ సందేహముతో
నమ్మరు ద్రావిడజనములు
నమ్మినలాభంబు లేదు ♦ నాకిఁక వారిన్. ౧౧

చం॥ అరయఁగ నార్యసంఘమున ♦ యందిపుడిప్పుడె భేదభావముల్
పొరయుచునుండెఁగాన నెటి ♦ పూనికతో నెటులైనవానినిన్
బెరయఁగఁజేసి చిక్కులను ♦ బెట్టి నిజంబుగ రెండుపక్షముల్
స్థిరముగఁ గూడకుండునటు ♦ చేసిన మేలగు రాజనీతిచే. ౧౨

ఉ॥ కౌరవపాండవుల్ తొడరి ♦ కౌరవరాజ్యరమానిమిత్తమై
పోరఁగనున్నవారలని ♦ పొక్కెను వార్తలు కాన వెంటనే
వారివిరోధముల్ చతురు ♦ పాయములన్ నిగుడింపఁ జేసియే
తీరున నైన దగ్గరకుఁ ♦ దీయుట మంచిది యొక్కపక్షమున్. ౧౩

కం॥ చతురంగబలముతోడన్
సతతము సప్తాంగ బహుళ ♦ సంపదతోడన్
ధృతరాష్ట్రపుత్రుఁ డుండెను
జతపడునే వాని పొత్తు ♦ సరిపడి మాకున్? ౧౪

ఉ॥ పర్యవసాన మేమయినఁ ♦ బాపమొ గీపమొ తప్పకుండ నా
యార్యులఁ జీలఁదీసి సమ ♦ యజ్ఞత వారలు కూడకుండఁగా
ధైర్యముతోడ నీపనిని ♦ దప్పక చేయక యున్న బాపురే!
కార్యము తప్పిపోయి యెడ ♦ కత్తెఱలోపలి పోకనయ్యెదన్. ౧౫

కం॥ బలవంతునితో నెన్నఁడు
చెలిమిం జేయంగ రాదు ♦ చేసిన యపుడే
సిలుగులు తప్పక కలుగును
జెలిమియు బగయౌచునుండుఁ ♦ జిట్టచివరకున్. ౧౬

ఉ॥ పగ్గెకలట్టివారు బహు ♦ బాహుబలాఢ్యులు నెట్టివారికిం
దగ్గరు పంచపాండవులు ♦ దర్పసమగ్రులు యుద్ధభూమి,మా
దగ్గరచుట్టముల్ గనుక ♦ దగ్గరతీసి వివేకమొప్ప నా
యగ్గముఁజేసికొన్నఁబసి ♦ యంతయు నెగ్గును నెగ్గులేటికిన్? ౧౭

కం॥ అన్ననన్నా! నన్నింత వి
పన్నునిఁ గావించినాఁడు ♦ బాహ్మద్రధియున్
గన్నీటి ధారలోలుకన్
మున్నీటి మయమ్మునందు ♦ మునుఁగఁగవలసెన్. ౧౮

గీ॥ చుట్టపక్కాలు తక్కువ ♦ చుట్టునున్న
యట్టిబలగంబుతక్కువ ♦ యగునుగానఁ
బరమసంతుష్టులగుచు నా ♦ ప్రాపు ప్రోపు
నొందఁ బాండవు లువ్విళు ♦ లూరుచుంద్రు. ౧౯

కం॥ కావున నామాటలపైఁ
గావలసిన యంతనమ్మ ♦ కంబుంతుసగా
డే వారలు దానివలన
నావచనములేవియైన ♦ నచ్చఁగవచ్చున్. ౨౦

ఉ॥ చండమదంబునన్ దిరిగి ♦ సాహసచర్యల నాచరించురా
ణ్మండలి వారికిన్ బృధకు ♦ మారులకుం బగఁజేసి పెట్టనా
యండను బాయకుండెదరు ♦ ప్రాణభయంబునఁ బాండవేయులున్
నిండుబలంబు చేకురును ♦ నిక్కముమేలగు నాకు దానిచే. ౨౧

గీ॥ రాజసూయాధ్వరంబాన ♦ ర్పంగఁ బాండ
వులను బురికొల్పి నంతటఁ ♦ బుడమిఁ బాడమి
యూరిపోవని శత్రుత్వ ♦ మఖిలరాజ
రాజితోడ ఘణంబులో ♦ రాజఁగలదు. ౨౨

వ॥ అనియీరీతి రాజనీతిజ్ఞుఁడై లోతువిచారించి, వితర్కించి; వెంటనే దేవర్షియగు నారదుని బిలిపించి, కార్యవిధానంబు సర్వంబు నిరూ

పించి, చెప్పిపంప, నారదర్షియు నింద్రప్రస్థంబున కేగి పాండవులచే నర్ఘ్యపాద్యాది విధులంబూజింపఁబడి, క్షేమసమాచారంబు లెఱింగి ప్రసంగవశంబున నేమియు నెఱుంగని వానింబోలె నిట్లుచెప్ప దొడంగె. ౧౩

కం॥ మొన మొన్ననె త్రిదివమునకుఁ
జనివచ్చిన వాఁడ నేను ♦ జనపాలా! మీ
జనకుని నటఁ గాంచితి నా
యనఘుఁడు సౌఖ్యముల నోల ♦ లాడుచునుండెన్. ౧౪

మత్తకో. నన్నుఁగాంచిన యంత మీపిత ♦ నాకమందున వెంటనే
నన్నుడగ్గరి మీదుక్షేమము ♦ నాముఖంబున సర్వమున్
విన్నవాఁడయిసంతసిల్లుచు ♦ బిక్కమోమున నావయిన్
గొన్నిమాటలు మీకుఁజెప్పఁగఁ ♦ గోరియిట్లని చెప్పెఁగా. ౧౫

మత్తకో. భూతలంబుననున్నయప్పుడు ♦ భూతలేశులఁ గూల్చుచున్
భూతిఁగూర్చుచు కానిమీకయి ♦ బుద్ధిపుట్టకపోయెఁగాఁ
భూతయజ్ఞము లాచరించుచుఁ ♦ బ్రోవనైతిని బుణ్యమున్
భూతలంబునువీడినప్పుడు ♦ పుణ్యలోకముఁజేరఁగా. ౧౬

మత్తకో. అజ్ఞుఁడయ్యునధర్ముఁడయ్యును ♦ నల్పుఁడయ్యును నెవ్వఁడే
యజ్ఞమొక్కఁడు చేసియుండునొ ♦ యట్టివానికి నిత్యమున్
బ్రజ్ఞగల్గును సత్యలోక ని ♦ వాసమొందఁగ సర్వదా
ప్రాజ్ఞులయ్యును నాకమందున ♦ బ్రాకులాడెదరన్యలున్. ౧౭

ఉ॥ ఎద్దడిలేని భూమితల ♦ మెల్లను నేలుచునుంటి వింటికిం
బెద్దవుపెద్దవీవయని ♦ పించుక పేరును మోసినావు నీ
కెద్దియు నడ్డులేదు పృథి ♦ వీశులు తమ్ములు రాజసూయమున్
వద్దనఁబోరు తోడుపడ ♦ వత్తురు జన్నము సేయునన్నచో. ౧౮

శా॥ నాకంబెన్ గుణహీనులైన నృపులున్ ♦ నాకంబె ధర్మచ్యుతుల్
నాకంబెన్ గడులుబ్ధులుండిరిగద ♦ నాన్నా! సత్యలోకంబులో

నాకుంగూర్పుము సత్యలోకము మహా ♦ నందంబువాటిల్లఁగా
సాకల్యంబుగ రాజసూయమను య ♦ జ్ఞంబొందుగావించుచున్.

గీ॥ తానఁ బిత్రాజ్ఞఁ బాలించి ♦ మాననీయ
చంద్రవంశమర్యాద దే ♦ శములయందు
నిలిపి, నన్నుద్ధరింపంగ ♦ వలయునంచుఁ
బలికి ధర్మజా! నన్ను మీ ♦ వద్దకంపె. ౩౦

కం॥ నారదుఁడాడిన మాటల
గారవమున నాలకించి ♦ కంపిల్లుచుఁ గ
న్నీరొలుకఁగ నిట్లనె వసు
ధారమణుఁడు తండ్రిపాట్లు ♦ తత్తరపెట్టన్. ౩౧

కం॥ తండ్రీ! చెప్పితి గదె మా
తండ్రి దివమునందు నందు ♦ తాపంబును నే
మంద్రోజనంబులు విన్నన్
తీంద్రించుచునుండె శోక ♦ తీవ్రత నన్నున్. ౩౨

గీ॥ తండ్రియానతి నేఁ దలఁ ♦ దాల్చి చేతు
రాజసూయ పవిత్రాధ్వ ♦ రంబు నిపుడె
కాని మా కేడుగడయైన ♦ కంసవైరిఁ
బిల్చి చెప్పవలసియుండుఁ ♦ బెద్దమాకు. ౩౩

వ॥ అనుచున్న వెంటనే దావారికుంకు చనుదెంచి శ్రీకృష్ణు నాగమ
నంబు వినిపింప యుధిష్ఠిరుండు దిగ్గనలేచి యెదురేగి సాష్టాంగ దం
డప్రణామంబు లాచరించిన శ్రీకృష్ణునిఁ గుచ్చి కౌఁగలించి యుచి
తాసనంబునఁ గూర్చుండఁబెట్టి, కుశలసంప్రశ్నముఁ జేసి, నార
దుండు చెప్పిన యుదంతంబు విన్పింప దరహసితవదనుండై యదూ
ద్వహుండు. ౩౪

గీ॥ ఇంతకన్నఁ గావలసిన ♦ దేమిమనకు?
తండ్రికన్న వేఱుగలండె ♦ దైవమొకఁడు?

## చతుర్థాశ్వాసము.

తండ్రి సంతుష్టిఁ బొందినఁ ♦ దప్పకుండ
భువనమంతయు సంతుష్టిఁ ♦ బొందఁగలదు. ౩౫

వ॥ దైవజ్ఞుల రావించి సుముహూర్తంబు నిశ్చయించి వెంటనే. ౩౬

ఉ॥ నల్వుర తమ్ములం బిలిచి ♦ నాలుగుదిక్కుల కప్పసంబులన్
గొల్వఁగఁ దేరఁ బంపు సమ♦పూర్వము ద్రవ్యములన్ని చక్కఁగాఁ
బిల్వఁగఁ బంపు చుట్టములఁ ♦ బెత్తనముం బొనరింప నిప్పుడే
పల్వుర చేత యజ్ఞము సె ♦ బాసనిపించెదఁ దండ్రిహర్షిలన్. ౩౭

క॥ కానుక లీయకయున్నన్
మానక దండెత్తిపోయి ♦ క్ష్మాపాలకులన్
దీనులఁ జేయుచు నీస్వా
ధీనముఁ గావింతు వారి ♦ దీమసమెడలన్. ౩౮

గీ॥ అధ్వరసమాప్తి యయ్యెడు ♦ నంతవఱకు
నిందెయుండి సంబారము ♦ లెల్లఁ గూర్చి
పెట్టి మెప్పించెద విరోధి ♦ వితతిచేతఁ
గలఁతపడనేల యీపాటి ♦ కార్యమునకు? ౩౯

మ॥ అని ప్రోత్సాహముఁ జేసినంతటనె య♦జ్ఞారంభ సంరంభియై
తన తోఁబుట్టుల నల్వురం బనిచెఁ బం♦తంబొప్ప నల్దిక్కులం
గని రాజన్యులనుండి యప్పనములం ♦ గైకొంచు రమ్మంచుఁ జ
య్యనఁ గుంతీతనయాగ్రజుం డపుడె పి♦త్రాజ్ఞా నిబద్ధాత్ముఁడై. ౪౦

గీ॥ కొన్ని దివసంబు లట్లేగె ♦ చన్నపిదపఁ
గవలు వడముడివచ్చిరి ♦ కానుకలను
సకల రాజచంద్రులనుండి ♦ సంగ్రహించి
వాసుదేవ ధర్మజులు సం ♦ తోసమంద. ౪౧

గీ॥ బేలుపోయిన మనసుతో ♦ విజయుఁ డొకఁడు
వట్టిచేతులతోఁ దిరిగి ♦ వచ్చెనకట!

సిగ్గు ముప్పిరిఁ గొనుచుండఁ ♦ జెప్పలేక
చెప్పె నగ్రజుతోఁ జట్ట ♦ చివరకిట్లు. ౪౨

ఉ॥ రాజగృహంబుఁజొచ్చుచు జ ♦ రాసుతుఁ గన్గొని యీఁటిపాటునన్
నేఁ జనివచ్చినట్టి పని ♦ నిన్ వినిపింపఁగ నవ్వి యిట్లనెన్
రాజవె ధర్మసూనుఁడవు ♦ రా! యిది యెన్నఁడువచ్చి పైఁబడెన్
రాజనుకొన్న మాత్రనె జ♦రాసుతుఁడిచ్చునె యుప్పనంబులన్? ౪౩

కం॥ అరియుప్పనంబులీయం
డరివారముఁ ద్రుంచుఁగాని ♦ యరుదెంచిన నా
హరిహరులరిఁ గొనఁదలఁగక
యరిగాపులఁ జేసికొనును ♦ నరి నరవరులన్. ౪౪

గీ॥ ఇటు జరాసుతుఁ డాడనే ♦ నేవపడియు
నోరు కదలింప కరికట్టి ♦ యూరకుంటిఁ
జేయునదిలేక యచ్చట ♦ సిగ్గువడితి
రాజచంద్ర దుస్సహ మీ ప ♦ రాభవంబు. ౪౫

ఉ॥ వానినిఁజంపి కాని కయి ♦ వాల్చను నాకనుదోయి ఱెప్పలన్
వానినిఁ జంపికాని కుడు ♦ వం దలపోయను భోజనంబునన్
వాని కఠోరవాక్యములు ♦ వానిఖలోక్తులు నీసడింపులున్
మానవనాథ నాచెవుల ♦ మానక గింగుఱు మంచునుండెఁబో. ౪౬

చం॥ అనవిని కృష్ణుఁడిట్లనియె ♦ నౌర! జరాసుతుఁడన్న నల్పుఁడే?
యని మొనఁ జూచితీరవలె ♦ నాతనిచేవ, బలంబు, సొంపు, నా
తని పటుముష్టియుద్ధము, గ ♦ దారణపాండితి, శత్రువీరులై
నను నుతియించి తీరుదురు♦నావలుకుల్ విని యూరకుండుమా. ౪౭

కం॥ భీమార్జును లిర్వుర నా
తో మానవనాథ పంపు ♦ తొందరపడకె
ట్లో మాగధు లోఁబఱచెద
సామముననో లేక ఘోర♦సమరమ్ముననో. ౪౮

